

# కొయ్యగుర్రం

అనేక వందల సంవత్సరాలక్రితం పర్షియా దేశాన్ని సాబూర్ అనే చక్రవర్తి పరిపాలించే వాడు. ఆనాడు ప్రపంచంలో ఎక్కడా ఆయనను మించిన సార్వభౌముడు లేడు. దానధర్మాలు చెయ్యటంలోనూ, ప్రజలను సుఖపెట్టటంలోనూకూడా ఆయనకు సాటి ఎవరూలేరు. ఆయన భవనంలోకి ఎటు వంటివారైనా స్వేచ్ఛగా ప్రవేశించి, తమకు కావలిసిన కోరికలు కోరవచ్చు; చక్రవర్తి నోట ఎన్నడూ, "లేదు" అన్న మాట వచ్చేదికాదు.

సాబూర్ చక్రవర్తికి కమరల్ అక్మార్ అని ఒక కొడుకూ, ముగ్గురు అందగత్తెలైన కుమార్తెలూ ఉండేవారు. ఆయన ఏటా రెండు ఉత్సవాలు జరిపేవాడు. ఒకటి వసంతకాలంలో జరిగేది, రెండవది శరత్కాలంలో జరిగేది. ఈ ఉత్సవాలప్పుడు చక్రవర్తి బ్రహ్మాండమైన విందులూ, సమారాధనలు చేసేవాడు. ఈ ఉత్సవాలకు ప్రపంచం అన్ని మూలలనుంచీ జనం వచ్చి, చక్రవర్తికి బహుమతులిచ్చి, ఆయనవల్ల సత్కారాలు పొందేవారు.

ఈ రెండు ఉత్సవాలకూ కొందరు ఖైదీలు విడుదల అయేవారు; ఉద్యోగులకు హోదాలూ, జీతాలూ పెరిగేవి.

ఒక ఏడు వసంతోత్సవానికి ముగ్గురు సిద్ధులు వచ్చారు. వారిలో ఒకడు హిందూ దేశంనుంచి వచ్చాడు, రెండవవాడు రూమీ దేశంనుంచి వచ్చాడు, మూడవవాడు పర్షియా లోనే ఉన్న ఒక దూరప్రాంతం నుంచి

ఆర్. దయానందరావు

వచ్చాడు. అందరిలాగే ఈ సిద్ధులుకూడా రాజుగారికి మూడు వస్తువులు బహుమానంగా పట్టుకు వచ్చారు. అయితే వీరు తెచ్చిన మూడు వస్తువులూ చాలా అపూర్వమైనవి.

హిందూదేశంనుంచి వచ్చిన సిద్ధుడు రాజుగారికి ఒక బంగారు మనిషివిగ్రహం బహూకరించాడు. ఆ విగ్రహం చేతిలో ఒక బంగారు బాకా ఉన్నది. రాజు ఆ విగ్రహాన్ని చూసి ముచ్చటపడి, "ఇది చాలా అందంగా ఉన్నది, కాని దీనివల్ల ఉపయోగమేమిటి ?" అని అడిగాడు.

"మహాప్రభూ, దీనిని మీ కోటద్వారం వద్ద ఏర్పాటుచేయించండి. శత్రువులెవరైనా కోటకేసి వచ్చినప్పుడు, ఈ విగ్రహం వారిని దూరంనుంచే పసిగట్టి, చేతిలో ఉన్న బాకాను నోటివద్దకు ఎత్తి ఊదుతుంది. ఆ చప్పుడు విని శత్రువులు చెల్లాచెదరై పారిపోతారు. ఈ విగ్రహం తమ కోటముందు ఉన్నంత కాలమూ తమకు శత్రుభయమన్నది ఉండదు," అన్నాడు హిందూదేశపు సిద్ధుడు.

తరవాత చక్రవర్తి రూమీదేశపు సిద్ధుడు తెచ్చిన బహుమతికేసి చూశాడు. ఒక విశాలమైన వెండిపలకమధ్యను ఒక బంగారు మగనెమలి ఉన్నది; దానిచుట్టూ



బంగారు ఆడనెమళ్లు అమర్చబడి ఉన్నాయి. అదికూడా చూడటానికి చాలా అందంగా ఉన్నది. దానివల్ల ఉపయోగమేమిటని చక్రవర్తి అడిగాడు.

"మహాప్రభూ, ఈ ఆడనెమళ్లు గంటకొకటివంతున రోజుపొడుగునా కూసి గంటలు తెలుపుతాయి. ఈ మగనెమలి నెలకొకమారు నోరు తెరిచి చంద్రవంకను చూపుతుంది. ఇదే ఈ నెమళ్లలో గల విశేషం," అన్నాడు రూమీదేశపు సిద్ధుడు.

చక్రవర్తి సంతోషించి మూడో బహుమానాన్ని తిలకించాడు. అది నల్లకర్రతో చేసిన గుర్రం. దానిపైన బంగారు నగిషీలూ,

తాపటం చేసిన రత్నాలూ వున్నాయి. దాని వీపున ఎక్కి కూర్చోవటానికి వీలుగా జీనూ, కాళ్లు పెట్టుకోవటానికి రికాబులూ వున్నాయి.

"చూడటానికి ఈ గుర్రం చాలా ముచ్చటగానే వున్నది. కాని దీనివల్ల ప్రయోజనమేమిటి?" అని చక్రవర్తి అడిగాడు.

దానికి పర్షియాదేశపు సిద్ధుడు, "మహాప్రభూ, ఇది కీలుగుర్రం. ఎవరైనాసరే దీనిపై ఎక్కి ఆకాశమార్గాన ఎక్కడికిపడితే అక్కడికి అతివేగంగా వెళ్లవచ్చు. మామూలు గుర్రాలపై ఒక ఏడాదిలో వెళ్లే దూరం దీనిపైన ఒక్కరోజులోనే వెళ్లవచ్చు!" అని జవాబిచ్చాడు.

"అద్భుతం! మీరు తెచ్చిన మూడు బహుమానాలూ అత్యద్భుతంగా వున్నాయి. వీటిని పరీక్షించితేగాని వీటి మహిమను నేను నమ్మలేను!" అన్నాడు చక్రవర్తి సాబూర్.

వెంటనే మూడు వస్తువులనూ పరీక్షకు పెట్టారు. అవి పరీక్షలో నెగ్గాయి. బంగారు విగ్రహం కోటకేసి వచ్చే సైనికులను చూడగానే బాకా వూది వారిని కంగారుపరిచింది. ఆడనెమళ్లు గంట గంటకూ కూతలు కూశాయి. పోతే, కీలుగుర్రాన్ని తెచ్చిన సిద్ధుడే దానిపై ఎక్కి ఆకాశంలోకి ఎగిరి, చాలాసేపు గుండ్రగా తిరిగి చివరకు చక్రవర్తి ముందు వాలాడు.



ఈ వింతలు చూసి చక్రవర్తి పొందిన అశ్చర్యం ఇంతా అంతా కాదు. అయన ముగ్గురు సిద్ధులనూ పిలిచి, "మీరు నాకు వెలలేని వస్తువులు తెచ్చి బహుమానంగా ఇచ్చారు. అందుకు ప్రతిఫలంగా మీరు కోరిన కోరికలు తీర్చటం నా విధి. కనుక నావల్ల మీకు ఏమికావాలో చెప్పండి. సంకోచించకుండా మీ కోరికలు ఏవైనాసరే నెరవేర్చుతాను," అన్నాడు.

వారు ముగ్గురూ రాజకుమార్తెలను వివాహమాడగోరారు. చక్రవర్తి సంకోచించక వెంటనే కాజీని పిలిపించి, నిండుసభలో వివాహపత్రాలు రాయించాడు.

చక్రవర్తి తన పెద్దకూతురిని హిందూదేశపు సిద్ధుడికీ, రెండవ కుమార్తెను రూమీ దేశపు సిద్ధుడికీ, మూడవ కుమార్తెను పర్షియా దేశపు సిద్ధుడికి ఇచ్చి త్వరలోనే పెళ్లి చేసేటట్టుగా ఏర్పాటయింది.

ఈ వివాహపత్రాలు తయారుకావటమంతా రాజకుమార్తెలు పరదావెనకనుంచి చూస్తూనే వున్నారు. వారు ముగ్గురిలోనూ చిన్నది తన అక్కలకన్నకూడా ఎంతో గొప్ప అందగత్తె. ఆమె తనకు కాబోయే భర్తను చూడగానే దడుచుకున్నది. ఎందుచేతనంటే ఆమెకు భర్త కానున్న పర్షియా దేశపు సిద్ధుడు శతవృద్ధుడు. శరీరమంతా





ముడతలు పడి, కళ్లు గుంటలు పడి, చూడటానికే మహా వికారంగా వున్నాడు.

అలాటి ముసలితొక్కు తనకు భర్త కాబోతున్నాడని తెలియగానే ఆమె దుఃఖం అపుకోలేక తన గదికి వెళ్లిపోయి, పక్కమీద బోర్లాపడి వెక్కివెక్కి ఏడవసాగింది. శోకావేశంలో ఆమె తన దుస్తులు చించుకున్నది, గోళ్లతో ముఖమంతా రక్కుకున్నది, జుట్టు చిందరవందర చేసుకుని శోకదేవతలాగా తయారయింది.

ఇది జరిగిన సమయాన రాజకుమారుడు అక్మార్ వేటకు వెళ్లివున్నాడు. అతను తిరిగి వస్తూనే తన చిట్టిచెల్లెలు స్థితి గమనించాడు. అతను వెంటనే ఆమెను సమీపించి, "ఎందు కేడుస్తున్నావు, చెల్లీ? నీకేం కష్టం వచ్చిందమ్మా? దాచకుండా నాతో నిజం చెప్పు!" అన్నాడు.

రాజకుమార్తె మరింత గట్టిగా ఏడుస్తూ, "నేనేమీ దాచను, అన్నా! నే నసలు ఈ ఇంట్లో వుండను. ఎక్కడికైనా వెళ్లి అడుక్కుతింటాను! నాన్న నాకు ఇంత అన్యాయం చేస్తున్నప్పుడు ఇక నాకు అల్లా తప్ప వేరు దిక్కులేదు!" అన్నది.

"నాన్న నీకు చేస్తున్న ద్రోహమేమిటో చెప్పు! నిష్కారణంగా నీ మనస్సును క్షోభ పెట్టుకోకు!" అన్నాడు అక్మార్.

"అన్నా, ఏంచెప్పను? నాన్న నన్నొక భయంకరమైన ముసలాడి కిచ్చి పెళ్లి చేస్తానని మాట యిచ్చాడు. ఆ ముసలాడు చూస్తే ఎవరో మాయలముచ్చులాగున్నాడు. వాడొక కీలుగుర్రాన్ని తెచ్చి నాన్నకు బహుమానం ఇచ్చి ఆయనను బుట్టలో వేసుకున్నాడు. నేనుమాత్రం ప్రాణమైనా తీసుకుంటానుగాని ఆ ముసలాణ్ణి పెళ్లాడను," అన్నది రాజకుమార్తె.

కమరల్ అక్మార్ చెల్లెల్ని అనేకవిధాల బుజ్జగించి సముదాయించి, తండ్రి వద్దకు వెళ్లి, "నాన్నా, ఎవడో మాయలమారివాడు

తెచ్చి నీకేదో బహుమానం ఇచ్చాట్ట; ఆ భాగ్యానికే నువు మన అమ్మాయిని వాడి కిచ్చి పెళ్లిచేయ సిద్ధపడ్డావుట! ఈవిధంగా అమ్మాయి గొంతు కొయ్యటం భావ్యమేనా? అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు!" అన్నాడు కోపంగా.

చక్రవర్తి సమీపంలోనే ఉండి ఈ మాటలు వింటున్న సిద్ధుడికి పట్టరాని కోపం వచ్చింది. కాని ఇంతలోనే చక్రవర్తి, "నాయనా, ఈ సిద్ధుడు తెచ్చిన కీలు గుర్రాన్ని స్వయంగా చూసిఉంటే నువ్విలా మాట్లాడవు," అంటూ తన కొడుకును బయటి ప్రాంగణంలోకి తీసుకువెళ్లాడు.

రాజసేవకులు కీలుగుర్రాన్ని తెచ్చి రాజ కుమారుడి ముందు పెట్టారు. దాని అందం చూడగానే అక్మర్ ముఖం విప్పారింది. అతను గుర్రపుస్వారీలో నిపుణుడు కావటం చేత, చెంగున కీలుగుర్రంపై ఎక్కి కూచున్నాడు. అతను మామూలు గుర్రాన్ని అదిలించినట్టే కీలుగుర్రాన్ని డొక్కలో మడమలతో గట్టిగా కొట్టాడు, కాని కీలుగుర్రం ఏమాత్రం కదలలేదు.

చక్రవర్తి సిద్ధుడికేసి తిరిగి, "గుర్రం కదలటంలేదు. అది కదిలే ఉపాయం మావాడికి చెప్పండి!" అన్నాడు. సిద్ధుడు రాజకుమారుడిదగ్గిరికి వెళ్లి, "గుర్రం



మెడలో కుడిపక్కన బంగారు మీట కని పిస్తున్నదే, దాన్ని పక్కకు తిప్పితే గుర్రం పైకి లేస్తుంది," అన్నాడు.

రాజకుమారుడు మీట తిప్పాడు. మరు క్షణం గుర్రం శరవేగంతో ఆకాశంలోకి సూటిగా లేచి, కొద్ది క్షణాలలో కంటికి కని పించకుండా పోయింది.

తన కొడుకు తిరిగి రావటంకోసం చక్ర వర్తి చాలాసేపు ఎదురుచూశాడు. ఎన్ని గంటలు గడిచినా అతని జాడ లేకపోవటం చూసి ఆయనకు ఆందోళన కలిగింది. ఆయన సిద్ధుడితో, "స్వామీ, మావాడు తిరిగి రావటానికి మనం ఏమి చెయ్యాలి ?" అని అడిగాడు.

తనకు రాజకుమార్తె నిచ్చి పెళ్లి చెయ్య గూడదన్నప్పటినుంచీ ఈ సిద్ధుడికి రాజ కుమారుడిపైన చాలా కోపంగా ఉంది. అందుచేతనే ఆయన అతడికి గుర్రాన్ని తిరిగి భూమిపైన దింపే కిటుకు చెప్పలేదు.

"రాజా, మనం చేయగలిగింది ఏమీ లేదు. నీ కుమారుడు తిరిగి వచ్చేమాట కల్ల. ఎందుచేతనంటే గుర్రాన్ని దింపే కిటుకు నేను చెప్పేలోగా మీవాడు మీట నొక్కి ఆకాశంలోకి వెళ్లిపోయాడు. అతను అంత తొందరపడటం అతని తప్పే!" అన్నాడు సిద్ధుడు.

ఈ మాటలు వినగానే చక్రవర్తికి సిద్ధుడి పైన పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆ కోపంలో ఆయన తన భటులను పిలిచి, "ఈ దుర్మార్గుణ్ణి చావగొట్టి కారాగృహం లోకి తొయ్యండి!" అని అజ్ఞాపించాడు. వారు అలాగే చేశారు.

ఆ తరవాత చక్రవర్తి దుఃఖసముద్రంలో మునిగిపోయాడు. ఆయన శోకం గమనించి రాజోద్యోగులు ఉత్సవాలు నిలుపుచేసి, దివాణం తలుపులు మూయించి, రాజ కుమారుడు కమరల్ అక్మార్ పోయినందుకు సంతాప ప్రకటనచేశారు. —(ఇంకా ఉంది)





# కీలుగుర్రం

## 2

[పర్షియాచక్రవర్తి చేసే వసంతోత్సవానికి ముగ్గురు సిద్ధులు వచ్చి మూడు అపూర్వమైన వస్తువులిచ్చారు. వాటిలో ఒకటి కీలుగుర్రం. ఈ బహుమానాలకు ప్రతిఫలంగా చక్రవర్తి తన ముగ్గురు కుమార్తెలనూ ఇచ్చి ముగ్గురు సిద్ధులకూ పెళ్లిచేయ నిశ్చయించాడు. కీలుగుర్రాన్ని ఇచ్చిన సిద్ధుడు శతవృద్ధు. చక్రవర్తి ఆఖరు కుమార్తె అతి సౌందర్యవతి. ఆమె ఆ వృద్ధును పెళ్ళాడటం ఇష్టం లేక ఏడవటం చూసి చక్రవర్తి కొడుకు కమరల్ అక్మార్ పెళ్ళికి వ్యతిరేకించాడు. తరవాత అతను కీలుగుర్రాన్ని పరీక్షించేటందుకు ప్రయత్నించగా ముసలి సిద్ధుడు అతనికి గుర్రాన్ని ఆకాశంలోకి ఎగిరించే కిటుకు చెప్పి, దించే కిటుకు చెప్పలేదు. అందుచేత అక్మార్ ఆకాశంలోకి ఎగిరిపోయి మరి తిరిగి రాలేదు. చక్రవర్తి సిద్ధుణ్ణి కొట్టి ఖైదులో పెట్టించి, తాను దుఃఖసముద్రంలో మునిగిపోయాడు.]

ఈలోపుగా కీలుగుర్రం సూటిగా ఆకాశంలోకి వెళ్లిపోతూ త్వరలోనే సూర్యమండలాన్ని చేరుకుంటుందా అనిపించసాగింది. రాజకుమారుడు అక్మార్ కంగారుపడసాగాడు.

"అ ముసలి సిద్ధుడు నన్ను నాశనం చెయ్యటానికే ఇలా చేశాడు. నా చిన్న చెల్లెలు తనని పెళ్ళాడకుండా అడ్డుపడ్డానని వాడికి నామీద ఆగ్రహం వచ్చివుంటుంది. ఇప్పుడు నేనేం చెయ్యాలి ? ఈ అపద తప్పే మార్గమేమిటి ? ఈ గుర్రం ఎగరటానికి మీట ఉన్నప్పుడు నేలమీద దిగటానికిమాత్రం మీట ఉండదా ?" అనుకుంటూ అతను

ఆర్. దయానందరావు



సహా రూపుమాసిపోతానని అతను భయ పడ్డాడు. కాని అలా జరగలేదు. భూమి దగ్గిరికి వచ్చినకొద్దీ గుర్రం వేగం తగ్గ సాగింది. చిట్టచివర కది అతి సుతారంగా ఈక వాలినట్టుగా, నేలమీద వాలింది.

రాజకుమారుడు కమరల్ అక్మార్ తిరిగి ధైర్యంతో ఊపిరి తీసుకున్నాడు. తనకు గుర్రం కిటుకు తెలిసినందుకూ, చావుతప్పి బతికి బయటపడినందుకూ అతను అల్లాకు ప్రణామాలు అర్పించాడు.

తరవాత అతను ఆ గుర్రాన్ని నడిపే యుక్తులన్నీ సాధించాడు. ఎందుచేతనంటే ఆ కీలుగుర్రం ఎగరటమూ, దిగటమూ మాత్రమే గాక, వెనక్కూ, ముందుకూ ఎగురుతుంది; వేగంగానూ, మెల్లిగానూ కదులుతుంది; కళ్ళెం లాగితే కుడికీ, ఎడ మకూ కూడా తిరుగుతుంది. ఈ ఉపాయా లన్నిటినీ రాజకుమారుడు అభ్యసించాడు. తెలియవలసిన కిటుకులన్నీ తెలిశాయని తోచినమీదట అతను ఆ గుర్రాన్ని గాలిలో కొద్ది ఎత్తుకు తీసుకుపోయి, సుమారైన వేగంతో పోనిస్తూ అనేక నదులూ, కొండలూ, నగరాలూ, దేశాలూ, సముద్రాలూ దాటి ప్రయాణమై వెళ్ళాడు. ఈ ప్రయాణంలో అతనికి పూర్వం తెలియని వింతలు ఎన్నో

గుర్రాన్ని అంతటా అతిజాగ్రత్తగా పరిశీ లించాడు. అప్పుడు గుర్రం జీనులో ఎడమ పక్క అతి చిన్న మేకులాటిది ఒకటి అతనికి కనబడింది.

"గుర్రం మొత్తంమీద ఇది తప్ప మరే మీటా ఉన్నట్టు కనబడదు," అనుకుని అతను దాన్ని నొక్కాడు. వాయువేగంతో పైకి దూసుకుపోతున్న గుర్రం క్రమంగా తగ్గసాగింది. కొద్దిసేపట్లో అది ఆకాశంలో ఆగిపోయి మళ్ళీ దిగనారంభించింది. దిగే టప్పుడు కూడా దానివేగం అంతకంతకూ విపరీతంగా హెచ్చసాగింది. తాను భూమి మీద అంత వేగంతోనూ పడిపోయి గుర్రంతో

కనిపించాయి; ఎన్నో కొత్త నగరాలూ, దేశాలూ చూసి ఆనందించాడు.

అలా అతను ఆకాశాన వెళుతూండగా, కింద నేలపైన అతని కొక సుందరమైన నగరం కనిపించింది. ఆ నగరంలోని భవనాలు బొమ్మల్లోలాగా చాలా అందంగా అమర్చి ఉన్నాయి. నగరంలో పచ్చిక బయళ్ళు తివాసీలు పరిచినట్టుగా ఉన్నాయి. వాటిమీద లేళ్ళూ జింకలూ పరిగెత్తుతున్నాయి. ఆ దేశంలో ఎక్కడ చూసినా జలప్రవాహాలే!

రాజకుమారుడు అక్మార్ తన గుర్రాన్ని ఆ నగరంమీదుగా గుండ్రగా తిప్పి అక్కడి ప్రకృతిసౌందర్యాన్ని తనివి దీర చూసి ఆనందించి, "ఈ నగరం ఏమిటో, ఇది ఏ దేశంలో వున్నదో, దీనికి రాజెవరో తెలుసుకోవాలి!" అనుకున్నాడు. సరిగా ఈసమయానికే సూర్యుడు అస్తమించి క్రమంగా చీకటి కమ్ముకురాసాగింది.

"ఈ రాత్రి ఈ నగరంలోనే గడుపుతాను. రేపు ఉదయం యిక్కడినుండి బయలుదేరి మా దేశం వెళ్లి, మా నాన్నగారితోనూ నా మిత్రులతోనూ నేను చూసిన వింతలూ, నాకు కలిగిన వింత అనుభవాలూ చెబుతాను," అనుకున్నాడతను.



తన గుర్రాన్ని ఎక్కడ దించాలా అని అతను ఆలోచిస్తూండగా అతనికి కింద ఒక రాజసౌధంలాటిది కనబడింది. అది సరిగా నగరం నడిమయాన వున్నది. దాని చుట్టూ బురుజులున్నాయి. కవచాలు ధరించిన నలభైమంది భటులు ఈటెలూ, విల్లులూ చేతబట్టి ఈ రాజసౌధానికి పహరా యిస్తున్నారు.

రాజకుమారుడు మీటనొక్కి కీలుగుర్రాన్ని రాజసౌధం పైభాగాన గల మిద్దెమీద దించాడు. తరవాత అతను గుర్రంమీది నుంచి దిగి ఆ గుర్రాన్ని చూసుకుని చాలా ముచ్చటపడి, "దీన్ని తయారుచేసినవాడు

నిజంగా సామాన్యుడుకాడు. అల్లా కటా క్షించి నేను ఇల్లు చేరుకుంటే ఆ ముసలి వాడికి ఎన్ని బహుమానాలైనా ఇస్తాను," అనుకున్నాడు.

బాగా చీకటిపడింది. అయితే రాజ భవనంలో జనసంచారం మాటుమణిగేదాకా రాజకుమారుడు ఆ మిద్దెమీదినుంచి ఇవతలికి రాలేదు. బాగా పొద్దుపోయింది. అతనికి ఆకలి దహించుకుపోతున్నది. చివర కతను తిండికోసం వెతుక్కుంటూ మిద్దె మీది నుంచి మెట్లు దిగివచ్చాడు. ఆ మెట్లు అతన్ని నేరుగా కిందికి తెచ్చాయి. అక్కడ ఒక చావడి కనిపించింది. దానిపై అందమైన చలవరాళ్ళు పరిచారు. వాటిపైన తెల్లని వెన్నెల పడుతున్నది. ఎక్కడా జన సంచారం గాని, మనుషుల అలికిడిగాని ఉన్నట్టు లేదు.

అతను నిశ్చేష్టుడై అటూ ఇటూ చూస్తూ, "ఎందుకు వచ్చిన పీడ. ఈ రాత్రికి ఆ మిద్దె మీదనే యెలాగో గడిపి తెల్లవారుతూనే బయలుదేరి మా దేశం పోతాను," అనుకుంటూండగా, రాజసౌధం లోపలిభాగంలో ఒక కాగడా వెలుగుతూ కనబడింది. ఆ వెలుగులో అంతఃపుర ద్వారం బయట పరుపుమీద పడుకుని గట్టిగా గురకపెట్టి నిద్రపోయే నల్లటి కొజ్జాబానిస కనిపించాడు.



వాడి పరుపు ద్వారానికి అడ్డంగా వేసివున్నది. కాగడా వెలుగులో వాడి కత్తిపిడి నిగనిగా మెరుస్తున్నది. వాడి భోజనసంచీ ఆ పక్కనే వున్న ఒక నల్ల రాతి స్తంభానికి బిగించబడిన మేకుకు వేళ్ళాడుతున్నది.

ఆ నీగ్రోబానిసను చూస్తేనే రాజకుమారుడికి కంపరం యెత్తింది. అతను ప్రాణాలరచేత బట్టుకుని అడుగులో అడుగువేసుకుంటూ ఆహారపుసంచీని సమీపించి, దాన్ని స్తంభంనుంచి దించి ఇవతలికి తీసుకువచ్చాడు. అందులో రుచికరమైన ఆహారం వున్నది. రాజకుమారుడు దాన్నితిని చావడి మధ్య వున్న జలయంత్రం వద్ద నీరుతాగి, ఆహారపుసంచీని తిరిగి స్తంభానికి తగిలించాడు. నీగ్రోబానిస ఇంకా గురకలుపెట్టి నిద్రపోతూనేవున్నాడు.

రాజకుమారుడు వాడి కత్తిపిడి పట్టుకుని వుపాయంగా కత్తిని ఒరనుండి బయటికి తీశాడు. నీగ్రో లేవలేదు.

రాజకుమారుడు ధైర్యంగా అంతఃపురంలోకి ప్రవేశించాడు. కొంతదూరం వెళ్లేసరికి అతనికి మరొక ద్వారమూ, దానికి అడ్డంగా కట్టివున్న మఖ్మల్ తెరా కనిపించాయి. అతను తెరను తోసుకుని ఒక విశాలమైన పడకగదిలోకి అడుగుపెట్టాడు. ఆ గదిలో దంతంతో తయారుచేసిన ఒక మంచంపైన





ఒక అపూర్వ సౌందర్యవతి నిద్రపోతున్నది. ఆమె ఆ దేశపు రాజుకూతురు. ఆమె మంచానికి నాలుగువైపులా నలుగురు దాసీలు నేలపై పడుకుని నిద్రపోతున్నారు.

రాజకుమారుడు అక్మార్ రాజకుమార్తె సౌందర్యం చూసి విభ్రాంతి చెంది స్తంభంలాగా నిలబడిపోయాడు. అంతలోనే రాజకుమార్తె నిద్ర మేలుకుని కళ్ళు తెరిచి కొత్త మనిషిని చూసి, భయపడటానికి మారుగా, "ఎవరు నీవు?" అని ప్రశ్నించింది.

అక్మార్ ఆమెను సమీపించుతూ, "నిన్ను ప్రేమించి పెళ్ళాడ వచ్చినవాణ్ణి!" అని ధైర్యంగా జవాబిచ్చాడు.

"నిన్ను లోపలికి యెవరు రానిచ్చారు?" అని రాజకుమార్తె మళ్లీ ప్రశ్నించింది. ఆమె పేరు షమ్స్ అల్‌నహార్.

"అల్లా రానిచ్చాడు! నా అదృష్టం నన్నిక్కడికి తెచ్చింది!" అన్నాడు అక్మార్.

"నిన్న నన్ను పెళ్ళాడటానికి హిందూ దేశంనుంచి ఒక రాజకుమారుడు వచ్చాడట. కొంపతీసి అది నువేనా? ఆయన అందంగా లేనందున మా నాన్నగారు పెళ్లికి ఒప్పుకోలేదు. నువు అందంగానే వున్నావే?" అన్నది రాజకుమారి నహార్.

ఈ మాట విని రాజకుమారుడు చాలా ఆనందం పొందాడు. అతను జవాబు చెప్పే లోపుగా రాజకుమారి చెలికత్తెలు నలుగురూ మేలుకుని, కొత్తవాణ్ణి చూసి ఎంతో కంగారు పడుతూ, "అమ్మగారూ, ఎవరీ మనిషి?" అని అడిగారు.

"నాకూ తెలియదు. కళ్ళు తెరిచేసరికి ఎదట ప్రత్యక్షమయాడు. నిన్న నన్ను పెళ్ళాడతానని వచ్చిన రాజకుమారుడేమో!" అన్నది నహార్.

"కాదు, కాదు. ఆ మనిషి వికారంగా వున్నాడు. మేము చూశాము," అంటూ దాసీలు కొజ్జావాణ్ణి నిద్రలేపి, "ఏమిరా? ఇదేనా అంతఃపురాన్ని నువు కాపలాకాసే

పద్ధతి ? ఈ మనిషిని లోపలికి రానిస్తావా?" అని తిట్టారు.

నీగ్రోబానిస కంగారుతో కత్తిదూయబోయి తన ఒర ఖాళీగా వున్న సంగతి తెలుసుకున్నాడు. వాడి కంగారు రెట్టింపయింది. వాడు పడకగదిలోకి వచ్చి రాజకుమారుణ్ణి చూసి, "అయ్యా, మీరు మనిషా? దయ్యమా ?" అని అడిగాడు.

"నీచుడా, నన్ను దయ్యమంటావా ? చూడు నిన్నేం చేస్తానో ?" అని అక్మార్ కత్తి దూసి వాడిపైకి వచ్చాడు.

"నన్ను నిష్కారణంగా చంపక, తమరెవరో సెలవివ్వండి !" అన్నాడు బానిస.

"నేను రాజుగారి అల్లుణ్ణి. అందుకనే నాభార్య ఉన్న చోటికి నేను వచ్చాను !" అన్నాడు రాజకుమారుడు.

"చిత్తం, తమరు అలా సెలవిస్తే నేనేమనేది ?" అంటూ బానిస అక్కడినుండి పరిగెత్తిపోయి, రాజుగారిని నిద్ర లేపుతూ కంగారుగా కేకలు పెట్టాడు.

రాజుగారు వాడి కంగారు చూసి, "ఏమిట్రా సంగతీ ? త్వరగా చెప్పు !" అన్నాడు అదుర్దాగా.

"మహారాజా, అమ్మాయిగారి పడకగదిలో ఒక దెయ్యం చేరి తమ అల్లుణ్ణని



చెబుతున్నది. వెంటనే వెళ్లి మీరా దయ్యాన్ని పదలగొట్టండి," అన్నాడు బానిస.

రాజుగారికి వాణ్ణి చంపాలన్నంత కోపం వచ్చింది. "తుచ్ఛుడా, నువ్వక్కడ ఉండి కూడా ఆ దయ్యాన్ని లోపలికి ఎందుకు పోనిచ్చావు ?" అంటూ ఆయన గబగబా రాజకుమార్తె పడకగదికి వచ్చి దాసీలతో, "ఏం జరిగింది ? ఏమిటిదంతా ?" అన్నాడు.

"మేమేమీ ఎరగము, మహారాజా! మాకు నిద్ర మెలుకువ వచ్చేసరికి ఈయన ఎవరో, ఎలా వచ్చాడో గాని, రాజకుమార్తెతో మాట్లాడుతూ మాకు కనిపించాడు," అన్నారు దాసీలు.

రాజుగారు అక్మార్‌ను సమీపించసాగాడు. ఈలోపుగా రాజకుమారుడు రాజకుమార్తెను, "ఈయనేనా మీ తండ్రి?" అని అడిగి, ఆమె అవునని తలవూపిన మీదట, కత్తి దూసి రాజుగారిపైకి లంఘిస్తూ పెడబొబ్బలు పెట్టాడు.

అతన్ని చూసి రాజుగారు భయపడి, "తొందరపడకు, కొంచెం ఆగు! ఇంతకూ నువు రాజకుమారుడివా, దయ్యానివా!" అని అడిగాడు.

"నేను సిసలైన రాజకుమారుణ్ణి. మీ కుమార్తె చాలా అందగత్తె అని విని ఆమెను పెళ్ళాడ వచ్చాను గనక సరిపోయింది గాని, నన్ను మరొకరు దయ్యమంటే వారి తల ఈపాటికి ఒక్క వేటుతో ఎగరగొట్టి ఉందును!" అన్నాడు అక్మార్.

"నువు నిజంగా రాజకుమారుడివే అయితే, దొంగతనంగా అంతఃపురంలోకి రావటం దేనికి? పైపెచ్చు నా అల్లుణ్ణని చెప్పుకుంటావా? ఇప్పుడు నా భటులను పిలిపించి నిన్ను చిత్రవధ చేయించానంటే నిన్ను అదుకునే వాడెవడు?" అని రాజు అక్మార్‌ను అడిగాడు.

"మీరు కొంచెంకూడా ఇంగితజ్ఞానం లేకుండా మాట్లాడుతున్నారు. నాకన్న మంచి అల్లుడు మీకెక్కడ దొరుకుతాడు.



అదీగాక భటులను పిలిచి మీ కూతురి పడకగదిలోకి పరాయివాడు ప్రవేశించాడని బయటపెట్టితే అప్రతిష్ఠ మీ కుమార్తెకే కదా?" అన్నాడు అక్మార్.

"అది నిజమే. కాని నా కూతురి పెళ్ళి బహిరంగంగా జరగాలి. ఎవరికీ తెలియకుండా జరిగిపోయిందంటే అదిమాత్రం నాకు అప్రతిష్ఠ కాదా? అందుచేత కాజీ సమక్షంలో నా కూతురును నువే బహిరంగంగా పెళ్ళాడు," అన్నాడు రాజు.

"నా అభ్యంతరం ఏమీలేదు, అలాగే పెళ్ళాడతాను. కాని అందుకు నేను కొన్ని నియమాలు చెబుతాను. వాటికి మీరు ఒప్పుకుంటేనే మీరు కోరిన ప్రకారం పెళ్లి జరుగుతుంది," అన్నాడు అక్మార్.

"ఏమిటా నియమాలు?" అని రాజు అడిగాడు.

"ఒక పద్ధతి ఏమిటంటే మీరు నాతో కత్తియుద్ధం చెయ్యటం. ఈ యుద్ధంలో మీరు ఓడిపోయే పక్షంలో మీ సింహాసనం నాకిచ్చెయ్యాలి. రెండో పద్ధతి ఏమంటే రేపు ఉదయం మీకున్న సైనిక బలాలన్నిటినీ నాపైకి యుద్ధానికి పంపటం. ఈ రెండు పద్ధతులలో దేనికో ఒకదానికి మీరు ఒప్పుకోవాలి. ఇంతకూ మీ కింద ఎంతమంది యుద్ధభటులున్నారు?" అన్నాడు అక్మార్.



"నలభైవేలమంది సైనిక భటులూ, మరి నలభైవేలమంది బానిస భటులూ ఉన్నారు," అన్నాడు రాజు.

"ఆ ఎనభైవేలమందినీ నాపైకి యుద్ధానికి పంపండి. వారు నన్ను చంప గలిగితే మీకుగాని, మీ కుమార్తెకుగాని ఎట్టి అప్రతిష్ఠా ఉండదు. నేను వారిని జయిం చానా నాలాటి అల్లుణ్ణి సంపాదించినందుకు లోకం మిమ్మల్ని మెచ్చుకుంటుంది," అన్నాడు అక్మార్.



రాజు ఈ రెండో పద్ధతికి ఒప్పుకున్నాడు. ఈ కుర్రవాడికి కొంచెం పిచ్చివుండి వుంటుం దనీ, తన భటులచేతిలో అతను తప్పక చస్తాడనీ రాజుకు తోచింది. ఆయన కొజ్జా వాణ్ణి పిలిచి, "ఒరే, నువు మన వజీరు వద్దకు వెళ్లి, మన సైనికుల నందరినీ మైదా నంలో హాజరుపెట్టమని వుత్తరు విచ్చినట్టు చెప్పు," అన్నాడు.

రాజాజ్ఞప్రకారం మంత్రి ఎనభైవేల మంది భటులనూ మైదానంలో నిలబెట్టిం చాడు. ఇంతలో తెల్లవారింది. యుద్ధం చెయ్యటానికి అక్మార్‌కు ఒక గుర్రంకావాలి గనక, రాజుగారు తన నౌకర్లను పిలిచి, "మన అశ్వశాలలో వున్న గుర్రాలన్నిటిలోకీ మంచి గుర్రంగా చూసి దాన్ని వెంటనే యుద్ధానికి ఆయత్తంచేసి యిక్కడికి పట్టుకు రండి!" అన్నాడు.

ఈ మాటలు విని అక్మార్, "మహారాజా, ఇక్కడికి నన్ను తెచ్చిన గుర్రం వున్నది. నాకు వేరే గుర్రం అవసరంలేదు," అన్నాడు.

"సరే, నీయిష్టం!" అంటూ రాజుగారు అక్మార్‌ను వెంటబెట్టుకుని మైదానంవద్దకు బయలుదేరాడు.

అక్కడ సైనికులు యుద్ధసన్నద్ధులై బారులుతీరి నిలబడివున్నారు. వారితో రాజు గారు ఇలా అన్నాడు:

"సైనికులారా, ఈ యువకుడు నా కుమా ర్తెను వివాహం చేసుకుంటానని వచ్చాడు.

తాను చాలా పరాక్రమవంతుణ్ణనీ, మిమ్మల్నందరినీ ఒంటరిగా జయించగలననీ అంటున్నాడు. ఇది నిజమైతే సంతోషించదగినమాటే గాని, అబద్ధమైన పక్షంలో ఇంతకంటె దుస్సాహసం మరొకటి వుండదు. అందుచేత ఇతను మీపైకి వచ్చినప్పుడు మీరు దయాదాక్షిణ్యాలు లేకుండా ఇతనితో యుద్ధంచేయండి!" తరవాత రాజుగారు అక్మార్‌కేసి తిరిగి, "ఇక నువ్వు యుద్ధం ప్రారంభించవచ్చు!" అన్నాడు.

"ఇది చాలా అన్యాయం. కాళ్ళపై నిలబడివున్న నేను ఇంతమందితో ఎలా పోరగలను?" అన్నాడు అక్మార్.

"మరి నేను గుర్రాన్ని యిస్తానంటే యెందుకు వద్దన్నావు? ఇప్పటికైనా మించిపోయిందిలేదు, గుర్రాన్ని సిద్ధంచేయించమంటావా?" అన్నాడు రాజు.

"నే నెక్కివచ్చిన గుర్రం వున్నది, మహారాజా. నాకు వేరే గుర్రం అవసరంలేదు," అన్నాడు అక్మార్. "ఆ సంగతి లోగడే చెప్పావు! ఇంతకూ ఆ గుర్రం ఎక్కడ వున్నది?" అన్నాడు రాజు.

"అది మీ భవనం మిద్దెపైనే వున్నది," అన్నాడు అక్మార్.

"మిద్దెపైననా?" అన్నాడు రాజు ఆశ్చర్యంతో. ఈ కుర్రవాడికి మతి సరిగా లేదన్న అనుమానం మరొకసారి ఆయనలో తల ఎత్తింది. "గుర్రం మిద్దెపైన ఎలా వుంటుంది? అయినా చూస్తాం?" అంటూ ఆయన తన సేనానాయకుణ్ణి దగ్గిరికి పిలిచి, "రాజభవనంపైన మిద్దెమీద ఏమున్నదో చూసి వెంటనే ఇక్కడ వున్నట్టు తిరిగిరా. అక్కడ ఏమైనా కనిపిస్తే దాన్ని వెంట పట్టుకురా!" అన్నాడు.

అక్కడ చేరిన ప్రజలు తమలో తాము, "గుర్రం ఎక్కడైనా మెట్లెక్కి మిద్దెమీదికి పోవటం వుందా? ఏమిటీ ఆశ్చర్యం?" అని గుసగుసలాడారు. —(ఇంకా వుంది)






# 3

[కీలుగుర్రంపై ఆకాశంలోకి ఎగిరిపోయిన రాజకుమారుడు అక్మార్ ఆ గుర్రాన్ని స్వాధీన పరచుకునే ఉపాయాలు తెలుసుకున్నాడు. అతను ఆ గుర్రంతోసహా ఒక దేశంలోని రాజ భవనంమీద దిగి అర్ధరాత్రి అంతఃపురంలో ప్రవేశించి అతి సౌందర్యవతి అయిన రాజ కుమార్తెను షమ్సుల్‌నహార్‌ను చూసి, ప్రేమించాడు. ఇంతలో ఆమె తండ్రి అక్కడికి వచ్చి అతనిని చూసి, తనకు పరువు భంగం అవుతుందనే ఉద్దేశంతో వారిద్దరికీ రహస్యంగా వివాహం చేస్తానన్నాడు. రాజుగారివద్ద ఉండే ఎనభైవేల ఆయుధభటులతోనూ ఒంటరిగా తనను యుద్ధం చేయనిచ్చినట్టయితే పెళ్ళాడతానన్నాడు అక్మార్. మర్నాడు సైన్యాన్ని ఆయత్తం చేశారు. "నా గుర్రం రాజభవనంమీది మిద్దెపై ఉన్నది. దాన్ని తెప్పించండి!" అన్నాడు అక్మార్. అందుకై రాజు తన సేనానాయకుణ్ణి పంపాడు.]

సేనానాయకుడు మిద్దె ఎక్కేసరికి అక్కడ అయనకు ఎంతో అందమైన గుర్రం కని పించింది. అంత అందమైన గుర్రాన్ని అయన ఎన్నడూ చూసి ఉండలేదు. కాని అయన దానిని సమీపించి చూస్తే అది చంద్రకొయ్యతోనూ దంతంతోనూ చేసినదని తెలిసింది. ఇది చూసి అయనా, అయన వెంట వచ్చిన భటులూ విరగబడి నవ్వారు.

"ఈ గుర్రంతోనా వాడు యుద్ధంచేసేది? వెర్రివాడులాగున్నాడే!" అన్నాడు ఒకడు.

"ఇందులో ఏదైనా తంత్రం ఉందేమో, ఎవరు చూశారు?" అన్నాడు మరొకడు.

అర్. దయానందరావు



భటులు ఆ గుర్రాన్ని ఎత్తుకుని మైదానానికి తీసుకువచ్చి రాజుగారి ఎదట ఉంచారు. వెంటనే దాని చుట్టూ జనం మూగి వింతగా చూడసాగారు.

రాజుగారు ఆశ్చర్యంతో అక్మార్‌కేసి తిరిగి, "ఇదేనా నీ గుర్రం?" అని అడిగాడు. అక్మార్ అవునని తలవూపాడు. "అలాగా! అయితే దానిమీద ఎక్కి యుద్ధానికి కదులు!" అన్నాడు రాజు.

"ఈ జనాన్ని దూరంగా వెళ్ళమనండి. ఆ తరవాత నేను దాన్ని ఎక్కి మీ బలాలన్నిటినీ క్షణంలో చెల్లాచెదురు చేస్తాను!" అన్నాడు అక్మార్.

"నువ్వు వారిని సంహరించటానికి ఏ మాత్రమూ సంకోచపడవద్దు. ఎందుకంటే వాళ్ళు నిన్ను చంపటానికి పూర్తిగా సంసిద్ధులై ఉన్నారు!" అన్నాడు రాజు.

జనం దూరం వెళ్ళగానే అక్మార్ గుర్రం మీద ఎక్కి కూచుని మీట నొక్కాడు. అందరూ నిశ్చేష్టులై చూస్తూ ఉండగా గుర్రం గాలిలోకి లేచి, అంతకంతకూ హెచ్చే వేగంతో ఆకాశంలోకి ఎగిరిపోయింది.

రాజుగారు తన భటులతో, "వాణ్ణి పట్టుకోండి, పట్టుకోండి!" అన్నాడు. కాని ఎగిరిపొయ్యేవాణ్ణి ఎవరుమాత్రం ఎలా పట్టుకుంటారు?

"మహారాజా, వాడు మనిషికాదు. దయ్యమో, భూతమో, మాంత్రికుడో అయి ఉండాలి. అందుకే మన కళ్ళలో దుమ్ము కొట్టి తప్పించుకుపోయాడు!" అన్నారు రాజుగారి అనుచరులు.

వాడి పీడ వదిలినందుకు రాజుగారు సంతోషించాడు. ఆయన తన భవనానికి తిరిగి వెళ్ళి, తన కుమార్తెతో మైదానంమీద జరిగిన సంగతులన్నీ వివరంగా చెప్పాడు. అంతా విని తన కుమార్తె సంతోషించటానికి బదులు బావురుమని ఏడవటం చూసి రాజుకు ఆశ్చర్యం కలిగింది.

"అమ్మా, వాడు దొంగ, అబద్ధాలమారి, దుర్మార్గుడు, పాపిష్టివాడు, జిత్తులమారి వెధవ! వాడు వదిలినందుకు అల్లాకు కృతజ్ఞత చెప్పుకోవాలి గాని ఎక్కడైనా ఏడుస్తారా ?" అన్నాడు రాజు.

తండ్రి ఎంత చెప్పినా రాజకుమార్తె దుఃఖం ఎక్కువయిందేగాని తగ్గలేదు. "అతను తిరిగి కంటపడేదాకా నేను నీరూ, ఆహారమూ ముట్టను. అంతదాకా ఏడుస్తూనే ఉంటాను!" అని ఆమె తండ్రికి తెలియజేసింది. కుమార్తె ఈవిధంగా శోక సముద్రంలో మునిగిపోవటంవల్ల రాజు గారినికూడా విషాదం ఆవరించింది.

ఈలోపల రాజకుమారుడు అక్మార్ తాను విడిచివచ్చిన నగరం పేరు 'సనా' అనీ, యమన్‌దేశానికి అది ముఖ్యపట్టణమనీ తెలుసుకున్నాడు. అతను తన కీలు గుర్రాన్ని స్వదేశానికేసి మళ్ళించి, తాపీగా ప్రయాణంచేస్తూ, చీకటిపడిన అనంతరం తన తండ్రి ఇంటిపై దిగాడు.

అక్మార్ వెళ్లిపోయినది మొదలు సాబూర్ చక్రవర్తీ, ఆయన కుటుంబమూ విచారంలో మునిగివున్నారు. చక్రవర్తి మెట్లు దిగి వస్తున్న తన కుమారుణ్ణి మొదట చూసి తనకేదో భ్రమ కలిగిందనుకున్నాడు. తరవాత ఆయన తన కుమారుణ్ణి ఆలింగనం చేసుకుని ఆనందంతో కంపించిపోయాడు. అక్మార్‌ను చూసి అతని ముగ్గురు చెల్లెళ్లూ ఆనందబాష్పాలు రాల్చారు. వారి ప్రాణాలకు చచ్చినవాడు బతికి వచ్చినట్టే అయింది.



అక్మార్ తన అనుభవాలన్నిటినీ చెప్పాక చక్రవర్తి తన భటులతో, "రేపు నగరమంతా అలంకరించి ఉత్సవాలు జరిపించండి. వారం రోజులపాటు నగరంలో విందులూ, వినోదాలూ జరగాలి!" అని ఉత్తరు విచ్చాడు. మర్నాడు ఖైదులలో వున్న వారంతా విడుదల చేయబడ్డారు. రాజుగారి ఖర్చుతో బ్రహ్మాండమైన విందులూ, వేడు

కలూ జరిగాయి. రాజకుమారుడు తిరిగి వచ్చినట్టు ప్రజలకు తెలియగలందులకు అతన్ని వీధివీధీ ఊరేగించారు.

ఊరేగింపు అయాక అక్మార్ తన తండ్రిని, "కీలుగుర్రం ఇచ్చిన సిద్ధుడు ఏమయాడు?" అని అడిగాడు.

"వాణ్ణి ఒక చీకటికొట్లో పెట్టించాను! వాణ్ణి అల్లా కనికరించరాదు! అందరు ఖైదీలను విడుదల చేసేటప్పుడు, వాణ్ణి మాత్రం విడుదల చేయలేదు!" అన్నాడు చక్రవర్తి.

అక్మార్ ఆ సిద్ధుణ్ణికూడా విడుదల చేయమని కోరాడు. చక్రవర్తి ఆ ముసలి వాణ్ణి ఖైదు విడిపించి, తన సమక్షానికి పిలిపించి, ఇష్టం లేకపోయినా శాలువ కప్పి, బోలెడంత ధనం బహుమతి ఇచ్చాడు.

రాజకుమార్తెను ఆ ముసలివాడి కిచ్చి పెళ్లిచెయ్యటం ప్రశంస రాజు తీసుకు రాలేదు, సిద్ధుడు ఎత్తనూలేదు. అయితే సిద్ధుడు లోలోపల మండిపోతున్నాడు. తన కీలుగుర్రాన్ని రాజకుమారుడి చేతికి అందనివ్వటం పొరపాటయిందని ఆయన కిప్పుడు తెలిసివచ్చింది. ఆ కుర్రవాడు దాని మర్మం తెలుసుకోనే తెలుసుకున్నాడు.

చక్రవర్తికి మటుకు కీలుగుర్రం పేరు చెబితే సింహస్వప్నమయింది. ఆయన



తన కొడుకుతో, "నాయనా, దేవుడి దయ వల్ల నువు మాకు తిరిగి దొరికావు. మరెన్నటికీ ఆ దిక్కుమాలిన గుర్రం జోలికి పోకు. అది చాలా మోసంతో కూడినది. దాని రహస్యాలలో నీకు బహుశా సగంకూడా తెలిసి ఉండవు!" అన్నాడు.

అక్మార్ ఇంటికి తిరిగి వచ్చాడేగాని సనా నగరపు రాజకుమార్తె నహర్ అతని కళ్లలో మెదులుతూనే ఉన్నది.

వారంరోజుల పాటు అతివైభవంగా విందులూ వినోదాలూ చూస్తున్నప్పటికీ అతను ఆమెను క్షణంసేపుకూడా మరవ లేదు. చివరకు అతనికి ఆమెను మళ్లీ చూడాలనే కోరిక తీవ్రంగా కలిగింది. తన తండ్రికి తెలియకుండా అతను మిద్దెమీదికి వెళ్లి, కీలుగుర్రాన్ని ఎక్కి యమన్ దేశానికి బయలుదేరాడు. అతను మాయమైన సంగతి తెలియగానే చక్రవర్తి తన భవనం మీద ఉండే కీలుగుర్రంకోసం చూశాడు. అది అదృశ్యమయినట్టు స్పష్టమయేసరికి ఆయన గుండె కొయ్యబారిపోయింది.

"ఒక్కడే కొడుకు! వాడి పాలిటికి ఈ మాయలమారి గుర్రం ఎక్కడ దాపరించింది? దాన్ని అప్పుడే ఎందుకు విరగగొట్టి ముక్కలు ముక్కలు చేశానుగాను?" అని ఆయన వాపోయాడు.





రాత్రి బాగా పొద్దు పోనిచ్చి అక్మార్ సనా నగరం చేరుకుని వెనకటిలాగే రాజభవనం పైన వాలాడు. అతను అంతఃపురం ప్రవేశించి రాజకుమార్తె శయనమందిరాన్ని సమీపించేసరికి ద్వారానికి కట్టిన తెరవెనక నుంచి మాటలు వినిపించాయి.

"అమ్మా, ఆ మోసగాడికోసం ఎంత కాలం నిద్రాహారాలు మాని ఉంటావు? నీకోసం అతను ఏడుస్తుంటే పోనీ అనుకోవచ్చు! అదేమీ లేనప్పుడు నువు ఒక్కతెవే ఎందుకిలా ఏడవాలి! మామాట విని భోజనం చెయ్యి, కులాసాగా ఉండు!" అని చెలికత్తెలు రాజకుమార్తెకు బోధచేస్తున్నారు.

"మీరు చెప్పేదంతా అబద్ధం. అతను నన్ను ఒక్క క్షణంకూడా మరిచిపోలేడు. నాప్రేమ ఎలాటిదో, అతని ప్రేమా అలాటిదే!" అని రాజకుమార్తె కుళ్లికుళ్లి ఏడుస్తున్నది.

సరిగా ఆ సమయంలో అక్మార్ తెర పక్కకు తొలిగించి, గదిలోకి అడుగు పెట్టాడు. రాజకుమార్తె వెంటవున్న సఖులు నిర్ఘాంతపోయారు. రాజకుమార్తె ముఖం ఒక్కసారిగా వికసించింది. "నీకోసం ఎంత ఏడ్చాను! నన్నెందు కిలా వదిలేసి వెళ్లి పోయావు! నువ్వింకొక రోజు ఆగి వచ్చిఉంటే నా శవం కనిపించి ఉండేదిగద!" అన్నదామె అక్మార్‌తో.

"నేనేం చేసేది? నన్ను నీ తండ్రి ఎలా అవమానించాడో చూశావుగద! నీ తండ్రి కావటంవల్ల బతికిపోయాడు గాని లేకపోతే నా కత్తికి బలిచేసేవాణ్ణి. ఆకలిగా ఉంది, భోజనం తెప్పించు!" అన్నాడు అక్మార్.

చెలికత్తెలు వెళ్లి ఇద్దరికీ భోజనపదార్థాలు తెచ్చి వడ్డించారు. కడుపునిండా తిన్న అనంతరం అక్మార్ తన ప్రియురాలితో, "నువు ఉపోషాలు చెయ్యకు. నేను వారానికొకసారి వచ్చి నీకు కనిపిస్తూ ఉంటాను. తెల్లవారక ముందే నేను బయలుదేరి వెళ్లాలి!" అన్నాడు.



"అమ్మయ్యో, ఇంక నిన్ను ఒంటరిగా వెళ్లనివ్వను. నన్నుకూడా మీ దేశం తీసుకుపో!" అన్నది రాజకుమార్తె సహర్.

"నాకోసం మీ దేశాన్నీ, తల్లిదండ్రులనూ వదిలి ఉండగలవా?" అన్నాడు అక్మార్.

"అదంతా నాకొక లెక్క కాదు. నీకోసం అన్నీ వదిలేస్తాను!" అన్నది రాజకుమార్తె.

తెల్లవారబోయే సమయంలో అతను మిద్దె మీదికి వెళ్లాడు. రాజకుమార్తె తనకున్న ఖరీదైన దుస్తులూ, సమస్త అభరణాలూ ధరించి, చెలికత్తెలతో సహా అతనివెంట మిద్దెమీదికి వెళ్లింది.

అక్మార్ కీలుగుర్రంమీద ఎక్కి కూచుని, తన వెనక రాజకుమార్తెను ఎక్కించుకుని, తన నడుముకూ ఆమె నడుముకూ కలిపి ఒక కోక చుట్టేశాడు. తరవాత అతను మీట నొక్కగానే గుర్రం గాలిలోకి లేచింది.

అంతవరకూ కిక్కురుమనకుండా ఉన్న రాజకుమార్తె పరిచారికలు, కీలుగుర్రం రాజకుమార్తెతో గాలిలోకి లేవగానే గట్టిగా ఆర్తనాదాలు చేశారు. ఆ కేకలు విని రాణీ, రాజూ మిద్దెమీదికి పరిగెత్తుకుంటూ వచ్చారు.

రాజు అక్మార్‌తో, "నాయనా, మాపైన దయచూపించు. మా కుమార్తెను మానుంచి వేరుచేయకు!" అని ఆక్రోశిస్తూ అన్నాడు.

అక్మార్ రాజకుమార్తెతో, "ఏమంటావు? నీ తల్లిదండ్రులు నీకోసం ఘోషిస్తున్నారు. వెనక్కు తిరిగిపోతావేమిటి?" అన్నాడు.

"నువ్వంటే నాకు వాళ్ళే కాదు, ఇంకేమీ అవసరంలేదు!" అన్నది రాజకుమార్తె.

ఈ సమాధానం విని రాజకుమారుడికి పరమానందమయింది. అతను సెలయేళ్లూ పచ్చికబయళ్ళూ గల చోట నేలపై దిగి విశ్రాంతి తీసుకుంటూ ప్రయాణంచేసి, మర్నాడు తెల్లవారేసరికి తన నగరం చేరాడు. కాని అతను కీలుగుర్రాన్ని నేరుగా ఇంటికి తీసుకుపోక, నగరంవెలపల ఉండే రాజోద్యానంలో దింపాడు. తన కాబోయే భార్యను

నగరంలోకి ఊరేగింపుతో తీసుకుపోవాలని అతని ఉద్దేశం.

ఉద్యానం నడిమధ్యను ఒక చక్కని మంటపం ఉన్నది. అక్మార్ తన ప్రియురాలిని ఆ మంటపంలోకి తెచ్చి కూర్చోబెట్టి, "నే నిప్పుడు మా ఇంటికి వెళ్ళి నువు వచ్చినట్టు మా తండ్రితో చెబుతాను. కీలు గుర్రాన్ని ఇక్కడే వదిలిపోతున్నాను. దాన్ని కాస్త జాగ్రత్తగా చూస్తూ ఉండు. నీకోసం కబురు వచ్చినప్పుడు నువు నీ సొంత భవనంలోకి వచ్చేద్దువుగాని," అని చెప్పాడు.

తరవాత అతను మామూలు గుర్రం ఒకటి ఎక్కి తన ఇంటికి వెళ్లిపోయాడు. అతన్ని చూసి చక్రవర్తి పరమానందం చెందాడు.

"నాన్నా, నావెంట సనా రాజకుమార్తె వచ్చింది. అంత అందగత్తె పర్షియాలోగాని, అరేబియాలోగాని ఉండదు. ఆమెను ఊరేగింపుతో తీసుకురావటానికి ఏర్పాట్లు చేయించు," అన్నాడు అక్మార్.

చక్రవర్తి ఊరేగింపు మహా ఆర్భాటంగా ఉండేటట్టు ఏర్పాట్లుచేసి దానివెంట తాను కూడా బయలుదేరాడు. ఊరేగింపు వెంట అన్ని రకాల వాద్యమేళాలూ ఉన్నాయి. రాజకుమార్తెకోసం అక్మార్ ఒక అందమైన సింహాసనాన్ని అద్భుతంగా అలంకరింపజేసి దాని చుట్టూ రకరకాల బానిసలను ఏర్పాటుచేశాడు. తాను తనకుగల దుస్తులన్నిటిలోకీ గొప్పవి ధరించాడు.

అయితే అతను ఊరేగింపువెంట వెళ్ళలేదు. ఆ ఊరేగింపు ఉద్యానం చేరటానికి చాలా కాలం పట్టుతుంది. అందుకని అతను వడిగల గుర్రాన్ని ఎక్కి అడ్డతోవను క్షణంలో ఉద్యానం చేరుకున్నాడు. అతను వచ్చి చూసేసరికి మంటపం నిర్జనంగా ఉంది. అందులో రాజకుమార్తె నహార్ లేదు. మంటపం బయట కీలుగుర్రం కూడా కనిపించలేదు. అక్మార్ గుండె ఆగిపోయినట్టయింది. —(ఇంకా ఉంది)





# కీలుగుర్రం

## 4

[సాబూర్ చక్రవర్తి కుమారుడైన అక్మార్ కీలుగుర్రం సహాయంతో సనానగరం చేరి అక్కడి రాజకుమార్తెను చూసి ప్రేమించాడు. సనారాజు అపవాదుకు వెరచి అక్మార్‌కూ, తన కుమార్తె సహర్‌కూ రహస్యంగా పెళ్లిచేయ తలపెట్టాడు. ఇలాటి పెళ్లి ఇష్టం లేక అక్మార్ మాయోపాయం చేసి సనానుంచి తప్పించుకుని ఇంటికి వచ్చి, తనకు కీలుగుర్రం ఇచ్చిన సిద్ధుణ్ణి ఖైదునుంచి విడిపించాడు. తరవాత వారంరోజులకు అతను సనాకు తిరిగి వెళ్లి ఎవరికీ తెలియకుండా సహర్‌ను కలుసుకుని ఆమెతోసహా తన దేశానికి తిరిగి వచ్చి, ఆమెను నగరం వెలపల ఉద్యానంలో ఉంచి తాను ఒంటరిగా తన తండ్రివద్దకు వెళ్లాడు. సహర్‌ను తీసుకురావటానికి చక్రవర్తి బాజాభజంత్రీలతోసహా బయలుదేరాడు. కాని అక్కడ ఉద్యానంలో రాజకుమార్తె మాయమయింది. కీలుగుర్రం కూడా మాయమయింది.]

అక్మార్‌కు గుండె ఆగిపోయినట్టయింది. అతను వెర్రివాడిలాగా అయిపోయి, తన ప్రియురాలిని ఎలుగెత్తి పిలుస్తూ అన్ని దిక్కులా పరిగెత్తాడు. కాని ఈ వెర్రి ఆవేశం కాస్త అణిగినాక అతని బుద్ధి తిరిగి పని చెయ్యసాగింది.

రాజకుమార్తె సహర్ గుర్రంపైన ఎక్కైనా వెళ్ళి ఉంటుందా అని అతనికి అనుమానం తగిలింది. కాని ఆమెకు కీలుగుర్రం కిటుకు తెలియదు; అతను చెప్పలేదు.

"సహర్ గుర్రాన్ని తీసుకుని వెళ్ళి ఉండదు. సిద్ధుడే పగకొద్దీ గుర్రాన్నీ,

అర్. దయానందరావు

రాజకుమార్తెనూ తీసుకుని పారిపోయి ఉంటాడు," అనుకున్నాడు అక్మార్.

ఈ అనుమానం తగలగానే అతను ఉద్యానపాలకులవద్దకు వెళ్ళి, "ఈ ఉద్యానంలోకి మరెవరైనా వచ్చారా? నిజం చెప్పండి, లేకపోతే మీ ప్రాణాలు తోడేస్తాను!" అన్నాడు.

ఉద్యానపాలకులు భయపడుతూ, "మరెవరూ రాలేదు, మహారాజా. ఏవో మూలికలు కావాలని సిద్ధుడు మాత్రం వచ్చాడు. అయన తిరిగి బయటికి వెళ్ళిపోలేదు, ఉద్యానంలోనే ఎక్కడో ఉండి ఉంటాడు!" అన్నారు.

అక్మార్ భయపడినంతా జరిగింది. సిద్ధుడు పగ తీర్చుకున్నాడు. పొంగివచ్చే దుఃఖాన్ని అపుకుంటూ రాజకుమారుడు ఉద్యానంకేసి వచ్చే ఊరేగింపుకు ఎదురు వెళ్ళి తన తండ్రితో జరిగిన సంగతి చెప్పాడు.

"నాన్నా, ఈ సైనికుల నందరినీ తీసుకుని ఇంటికి తిరిగి వెళ్ళు. ఈ మోసం అంతు తేల్చినదాకా నేనింటికి రాను!" అన్నాడతను తండ్రితో.

చక్రవర్తి కళ్ళనీళ్ళ పర్యంతమయాడు. తన ఏకైక పుత్రుడు ఇంతటి ఘోర శపథం పూనటం ఆయనకు చాలా బాధ కలిగించింది.



"వృథాగా ఎందుకు శ్రమపడతావు, నాయనా? నువు వెళ్ళిపోతే నేనేమైపోయేది? నీ కోపాన్నీ, దుఃఖాన్నీ దిగమింగుకుని నాతో ఇంటికి వచ్చెయ్యి. నీకు కావాలంటే ప్రపంచంలో గల ఏరాజకుమార్తెనైనా తెచ్చి ఇస్తాను! నహర్ కోసం అంతగా విచారించకు!" అన్నాడాయన కొడుకుతో.

కాని ఈ మాటలు అక్మార్ చెవికెక్కలేదు. అతను తొందర తొందరగా తన తండ్రికి వీడ్కోలు చెప్పి తానెక్కి ఉన్న గుర్రం మీద అతివేగంగా వెళ్ళిపోయాడు. చక్రవర్తి కంటివెంట కన్నీరు కార్చుతూ, నిస్పృహతో ఇంటికి తిరిగి వెళ్ళాడు. ఆయన ఎంత సంతోషపడ్డాడో అంత నిరాశా, దుఃఖమూ ఆయనకు దాపరించాయి.

ఆ రోజు ప్రాతఃకాలపువేళ మూలికలు ఏరుకుందామనే పర్షియా సిద్ధుడు ఆ ఉద్యానం ప్రవేశించాడు. కాని లోపలికి రాగానే కస్తూరీ, పునుగూ, జవ్వాది మొదలైన పరిమళాలు ఆయనకు తగిలాయి. సిద్ధుడు ఆశ్చర్యంతో ఆ వాసనలనుబట్టి వెళ్లి మంట పాన్ని చేరేసరికి అక్కడ ఆయనకు తాను తయారుచేసిన కీలుగుర్రం కనిపించింది.

వెంటనే సిద్ధుడికి పంచప్రాణాలూ లేచి వచ్చినట్టయింది. ఈ గుర్రాన్ని పోగొట్టుకున్న నాటినుంచీ ఆయన మనస్సుకు శాంతి






అన్నది లేదు, నిద్రాహారాలు లేవు." ఆయన దాన్ని పరీక్షచేసి దాని కీళ్లు యావత్తూ సరిగా ఉన్నట్టు తెలుసుకున్నాడు. దానిమీద ఎక్కి వెళ్లిపోదా మనుకునేటంతలో ఆయన కొక ఆలోచన తట్టింది. రాజకుమారుడు ఈ గుర్రంపై ఇంకెవరినో తెచ్చిఉంటాడు. వారిని ఈ మంటపంలో దించి, వారి కాపలాకిందనే ఈ గుర్రాన్ని ఇక్కడ వదిలిపెట్టి ఉంటాడు.

ఆ మనిషి ఎవరో చూతామని సిద్ధుడు మంటపంలో ప్రవేశించేసరికి, సూర్యుడిలాగా వెలిగిపోతూ శయ్యపై పడుకునిఉన్న రాజకుమార్తె నహర్ ఆయన కంట పడింది. ఆమె సామాన్యురాలు కాదనీ, గొప్ప పుటక పుట్టిన మనిషి అయిఉంటుందనీ, ఆమెను అడంబరంగా నగరంలో ఊరేగించి తీసుకుపోయే ఉద్దేశంతోనే రాజకుమారుడామెను ఊరిబయట ఈ ఉద్యానవనంలో దించాడనీ ఆయన గ్రహించాడు. ఆయన రాజకుమార్తెను సమీపించి సలాము చేసి పలకరించాడు.

రాజకుమార్తె మెల్లిగా కనురెప్పలు ఎత్తి సిద్ధుడికేసి చూసి, ఆయన వికారాకారం కంట పడేసరికి వెంటనే కళ్లు గట్టిగా మూసేసుకుని, "ఎవరు నువు?" అని అడిగింది.

"మహారాణీ, నేను రాజకుమారుడి నౌకరును. మా యజమాని మిమ్మల్ని ఇంకొక మంటపానికి చేర్చమన్నారు. అది ఇంతకంటె కూడా బాగుంటుంది. అదీగాక నగరానికి అది ఇంతకన్న దగ్గిర. అసలు విషయమేమిటంటే పెద్దరాణీగారికి ఒంట్లో అంత బాగాలేదు. తమరిని తోడ్కొని పోవటానికి వారు ఇంతదూరం రాలేరు!" అన్నాడు సిద్ధుడు.

"ఇంతకూ మీ యువరాజుగారేరీ?" అన్నది రాజకుమార్తె.

"వారు చక్రవర్తిగారి వెంట ఉన్నారు. అందరూ కలిసి మేళతాళాలతో, బాజా

భజంత్రీలతో వచ్చి తమరిని తీసుకుపోతారు," అన్నాడు సిద్ధుడు.

"అంతా బాగానే ఉందిగాని యువరాజుగారు నీవంటి అందవికారమైన మనిషిని పంపారేమిటి?" అన్నది రాజకుమార్తె.

సిద్ధుడికి ఈమాట శూలంలాగా తగిలి బాధకలిగింది. కాని ఆయన ఆబాధను పైకి కనపడనివ్వక, పాలిపోయిన తన ముఖమంతా ముడతలు పడేలాగా నవ్వుతూ, "ఆ మాట నిజం, మహారాణీ! దివాణంలో నాకన్న అందవికారమైన మనిషి లేడు. అయినా నా సామర్థ్యం యువరాజుగారికి తెలుసు, త్వరలోనే తమకుకూడా తెలుస్తుంది, అప్పుడు నన్ను తమరుకూడా మెచ్చుకుంటారు. అందమైన నౌకర్లు ఎంతో మంది ఉన్నా, వాళ్లను పంపటం ఇష్టం లేకనే యువరాజుగారు నన్ను పంపారనుకోరాదా?" అన్నాడాయన.

ఈ మాటతో రాజకుమార్తెకు ఆ ముసలివాడిపై నమ్మకం కుదిరింది.

ఆమె శయ్యమీద నుంచి లేచి నిలబడి, "నన్ను ఏమి ఎక్కించి తీసుకుపోతావు?" అని సిద్ధుణ్ణి అడిగింది.

"ఇదుగో, ఈ కీలుగుర్రం ఉన్నదిగా?" అన్నాడు సిద్ధుడు.



"నాకు దానిమీద స్వారిచెయ్యటం చేతకాదే?" అన్నదామె.

"నాకు తెలుసును. నావెనక ఎక్కండి!" అంటూ సిద్ధుడు గుర్రంఎక్కి కూచున్నాడు. రాజకుమార్తె ఆయన వెనక ఎక్కి కూచున్నది. ఆమెను తన నడుముకు భద్రంగా కట్టేసి సిద్ధుడు గుర్రాన్ని కదిలించే మీట నొక్కాడు. గుర్రం సూటిగా ఆకాశంలోకి లేచింది. కొద్దిక్షణాలలో నగరం కంటికి కనపడకుండా పోయింది.

"మీ యజమాని చెప్పినదేమిటి? నువు చేస్తున్నదేమిటి?" అని రాజకుమార్తె ముసలివాణ్ణి అడిగింది.

"నా యజమానా? నాకు యజమాని ఎవడు?" అన్నాడు సిద్ధుడు.

"యువరాజుగారు!" అన్నది రాజకుమార్తె.

"ఏదేశపు యువరాజు? నువ్వు మాట్లాడేది రాజకుమారుడు అక్మార్‌గురించా? వాడు వట్టి చవట, పనికిమాలిన వాజ!" అన్నాడు సిద్ధుడు కోపంగా.

"నీ యజమానిని గురించి ఇలాగేనా మాట్లాడేది. ముసలి పీనుగా?" అన్నది రాజకుమార్తె.

"వాడు నా యజమాని అంటావేమిటి? నేనెవరో నీకు తెలుసా?" అన్నాడు సిద్ధుడు.

"నువ్వు చెప్పినమాటలు తప్ప నాకు వేరే ఏమీ తెలీదు," అన్నది రాజకుమార్తె.

"అవన్నీ నిన్ను మోసంచెయ్యటానికి, ఆ అక్మార్‌ను మోసంచెయ్యటానికీ ఆడిన అబద్ధాలు. నేను కష్టపడి తయారుచేసిన ఈ గుర్రాన్ని వాడు కాజేసి నన్ను మహా ఏడిపించాడు! ఇక వాణ్ణి ఏడవనీ! నువ్వు ధైర్యంగా ఉండు. ఆ చవటకన్న నేను నిన్ను వెయ్యిరెట్లు బాగా చూస్తాను. నీకు అంతులేని బట్టలూ, సగలూ ఇస్తాను. వేలకు వేలు దాసీజనాన్ని ఇస్తాను. రాజాధిరాజులకుకూడా సాధ్యంగాని వైభవం నీకు జరిపిస్తాను!" అన్నాడు సిద్ధుడు.



రాజకుమార్తె, "అయ్యో, దేవుడా! నాకీ దుర్గతి ఏమిటి? మొదట తల్లిదండ్రులకు దూరమై, ఇప్పుడు నా ప్రియుడికికూడా కాకుండా పోయానా?" అని కంటనీరు గార్చుతూ ఏడవసాగింది.

సిద్ధుడు తన గుర్రాన్ని రూమ్‌దేశానికి తీసుకుపోయి ఒక పచ్చని బయలులో దింపాడు. అక్కడ చక్కని సెలయేళ్లు పారుతున్నాయి. ఈ బయలుపక్కనే ఒక నగరం ఉన్నది. దాన్ని ఒక సుల్తాను పాలిస్తున్నాడు. గుర్రం బయలులో దిగిన సమయానికే ఆ సుల్తాను అక్కడికి షికారుగా వచ్చాడు. గుర్రం నుంచి దిగిన మరుక్షణమే సుల్తాను భటులు సిద్ధుణ్ణి చుట్టుముట్టి పట్టేశారు. వారు ఆయననూ, రాజకుమార్తెనూ, కీలుగుర్రాన్నీ తీసుకుపోయి సుల్తాను ఎదట ఉంచారు.

సుల్తాను సిద్ధుణ్ణీ రాజకుమార్తెనూ చూసి నిర్ఘాంతపోయాడు. ఒకే కంటితో లోకంలో కల్లా అందవికారమైన మగవాణ్ణీ, అందగత్తె అయిన ఆడదాన్నీ చూసినట్టు సుల్తానుకు తోచింది.

"ఏమమ్మా? కాకి ముక్కుకు దొండపండు కట్టినట్టు నిన్ను ఈ ముసలిముచ్చుకు ఎలా ముడిపెట్టారు?" అన్నాడు సుల్తాను రాజకుమార్తెతో.





" ఈమె నా బంధువురాలేనండీ! మాకు చాలాకాలం కిందటే వివాహమయింది!" అన్నాడు సిద్ధుడు, రాజకుమార్తె జవాబు చెప్పేలోగా.

"అన్నీ పట్టిది, బాబూ! ఈ ముసలి పీనుగు ఎవడో నేనసలు ఎరగను. వీడు మంత్రగాడు. నన్ను మోసగించి బలాత్కారంగా తెచ్చాడు," అని రాజకుమార్తె నిజం చెప్పేసింది.

ఈ మాటలు విని రూమ్ సుల్తాను ముసలివాణ్ణి కొట్టమని భటులకు ఉత్తరువిచ్చాడు. వాళ్లు సిద్ధుణ్ణి కసితీర కొట్టేసరికి సిద్ధుడు చచ్చినంత పని అయింది.

తరవాత సుల్తాను సిద్ధుణ్ణీ, రాజకుమార్తెనూ, కీలుగుర్రాన్నీ నగరానికి వెంటపెట్టుకుపోయి, సిద్ధుణ్ణి ఒక చీకటికొట్టులో తోయించి, గుర్రాన్నీ, రాజకుమార్తెనూ తన యింటికి తీసుకుపోయాడు. ఆ కీలుగుర్రంలో ఉండే విశేషంమటుకు సుల్తానుకు ఏమీ తెలియదు.

ఈలోపల రాజకుమారుడు అక్మార్ గుర్రంమీద తన ప్రియురాలిని వెతుకుతూ బయలుదేరి ఒక్కొక్క నగరమే చేరి, అక్కడివారిని, " మీరీ నగరంలో ఒక కీలుగుర్రాన్ని చూశారా ?" అంటూ దాని శక్తులను వర్ణించసాగాడు.

అతని ప్రశ్న విన్నవారు ఒక్కరుకూడా అతని మాటలు నమ్మలేదు. పైపెచ్చు అతనికి మతి చెడిందనికూడా అనుమానపడ్డారు.

అక్మార్ రాజకుమారుడు ఇలా చాలా రోజులు ప్రయాణం చేసి సనానగరం చేరి అక్కడి ప్రజలనుకూడా అదేవిధంగా ప్రశ్నించాడు. సనానగరవాసులకు రాజకుమార్తె జాడగానీ, కీలుగుర్రం జాడగానీ తెలియకపోవటం అటుంచి. రాజూ, రాణీ తమ కుమార్తె కోసం బెంగపడి విచార సముద్రంలో మునిగిఉన్నారని అతనికి తెలియవచ్చింది.

అక్మార్ ఇక అక్కడ నిలవక ముందుకు సాగి, మరికొంత కాలానికి మరొక నగరం చేరాడు. అక్కడ అతను దిగిన బసలోనే కొందరు వర్తకులుకూడా దిగారు. వారంతా కబుర్లు చెప్పుకునే సందర్భంలో ఒకడు, "అయ్యా, ఈమధ్య నేను రూమ్నగరం వెళ్లినప్పుడు అక్కడ ఒక వింత విషయం విన్నాను. ఒకనాడు అక్కడి సుల్తానుగారు వేటకు వెళితే ఆయనకు ఒక వికారాకారు డైన ముసలివాడూ, భూలోకరంభలాటి యువతీ తటస్థపడ్డారట. అంతకన్న చిత్ర మేమిటంటే వారివెంట చంద్రకొయ్యతో చేసిన గుర్రం ఉన్నది," అంటూ చెప్పుకు పోయాడు. ఆ కథ వింటున్న అక్మార్‌కు తాను వెతకబోయిన తీగె కాలికి తగిలినట్ట యింది. అతను వెంటనే రూమ్నగరం ఎటు వైపుగా ఉన్నదీ, అక్కడికి ఎంతదూరంలో ఉన్నదీ ఆరా తీసి జాగు చేయకుండా అక్కడికి ప్రయాణమయాడు.

అతను నగరం ప్రవేశించేటప్పుడు నగర ద్వారపాలకులు అతనిని పట్టుకుని సుల్తాను ప్రశ్నించటానికిగాను నిలిపారు. నగరానికి వచ్చే పరదేశీలను సుల్తాను ప్రశ్నించటం ఆ నగరపు ఆచారం. అయితే ఆ రోజు అప్పటికే చాలా పొద్దుపోయి ఉండటంచేత సుల్తాను గారి దర్శనం మర్నాడు ఉదయానికిగాని



దొరకదు. అందుచేత వారు అక్మార్‌ను ఆ రాత్రి ఖైదులో ఉంచటానికి తీసుకుపోయారు.

అయితే ఏ అపరాధమూ చెయ్యని ఆ యువకుణ్ణి తెల్లవార్లూ ఖైదులో ఉంచడం వారికే బాధ అనిపించింది. వారు అతన్ని తమతోపాటు భోజనం చెయ్యమని అహ్వానించి, భోజనాలయాక తమలో తాము కబుర్లు చెప్పుకోసాగారు.

మధ్యలో ద్వారపాలకులలో ఒకడు రాజకుమారుడికేసి తిరిగి, "నువు ఏ దేశంనుంచి వస్తున్నావు, బాబూ?" అని అడిగాడు.

"మాది పర్షియా!" అన్నాడు అక్మార్. ఈమాట విని అందరూ నవ్వారు.

"మీ దేశంవాడే ఒకడు చీకటి కొట్లో ఉన్నాడు. అబ్బ, వాడు ఏం బడాయిలు చెబుతాడని! అంత అబద్ధాలాడేవాణ్ణి ఎక్కడా చూడలేదు. నువుకూడా అలాటివాడివి కావు గద? పైపెచ్చు వాడు ఎంత వికారంగా ఉంటాడో చెప్పటానికి లేదు!" అన్నాడొకడు.

"వాడేమి అబద్ధాలు చెప్పాడేం?" అని అక్మార్ అడిగాడు.

"ఒకటేమిటి? వాడు సిద్ధుడుట, వైద్యం చేస్తాట్ట! మా సుల్తానుగారు ఒకనాడు షికారు వెళితే వారికి దారిలో ఈ ముసలివాడూ, ఒక అప్సరసలాటి అమ్మాయీ, ఒక అద్భుతమైన కొయ్యగుర్రమూ దొరి



కాయి. ఆ అమ్మాయి ఎంత అందంగా ఉంటుందో చెప్పటానికి లేదు. మా సుల్తాను గారు ఆమెను పెళ్ళాడదామనికూడా అనుకున్నారు; కాని అంతలోనే ఆ పిల్లకు పిచ్చెత్తిపోయింది. ముసలాడు నిజంగా వైద్యం తెలిసినవాడైతే ఆమెకు పిచ్చి నయం చెయ్యరాదూ? అది వాడి తరమా? సుల్తాను గారు ఎంతోమంది హేమాహేమీలచేత చికిత్స చేయించారు. ఎంతో డబ్బు ఖర్చు చేశారు. కాని ఆ పిచ్చి నయం కాకుండా ఉంది!" అన్నారు వాళ్ళు.

"ఇంతవరకు వ్యవహారం సవ్యంగానే నడిచింది. ఇప్పుడు నేనేం చెయ్యాలి?" అని రాజకుమారుడు అక్మార్ తనలో తాను వితర్కించుకున్నాడు.

పడుకునే వేళ అయేసరికి కాపలావాళ్లు రాజకుమారుణ్ణి ఖైదులో ఒక గదిలో పెట్టి, దానికి జాగ్రత్తగా తాళం వేసి తమ దారిన తాము వెళ్లి పడుకున్నారు.

అక్మార్‌కు నిద్ర పట్టలేదు. చీకటికొట్టులో బంధించి ఉన్న సిద్దుడు మూలుగుతూ తనలో తాను పర్షియాదేశపు భాషలో మాట్లాడుకుంటూ ఉండటం అతనికి వినపడింది.

"ఎంత దౌర్భాగ్యుణ్ణి! నేను వేసిన పాచిక ఒకటీ పారకపోయెనే! చెయ్యి చిక్కిన పిట్ట దక్కకపోయెనే!" అని ముసలివాడు వాపోతున్నాడు.

అక్మార్ సిద్ధుణ్ణి గుర్తించి, "అదృష్టహీనుడివి నువు ఒకడివే ననుకున్నావా? ఎందుకా ఏడుపు?" అన్నాడు తమ భాషలో.

ఈ మాటలు విని సిద్ధుడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆ మాట్లాడినది అక్మార్ అని వాడు గ్రహించలేదు. అందుచేత తాను వేసిన ఎత్తూ, అది విఫలమైన విధమూ అతనికి సిద్ధుడు పూసగుచ్చినట్టు చెప్పాడు. తెల్లవార్లూ ఆ ఇద్దరూ ఆప్తస్నేహితులులాగా సంభాషించుకున్నారు.

—(ముగింపు పై సంచికలో)





# కీలుగుఱ్ఱం

## 5

[ తన ప్రియురాలిని నగరం వెలపల ఉద్యానంలో దించి, ఆమె రక్షణలో కీలుగుర్రాన్ని ఉంచి రాజకుమారుడు అక్మార్ తన తండ్రితో మాట్లాడటానికి వెళ్లి ఉన్న సమయంలో సిద్ధుడు అటుగా వచ్చి, రాజకుమార్తెకు మాయమాటలు చెప్పి ఆమెను కీలుగుర్రంపై ఎక్కించుకుని రూమ్‌దేశం చేరాడు. వెంటనే అక్కడి సుల్తాను ఆయనను పట్టి చీకటి కొట్టులో బంధించాడు. సుల్తాను రాజకుమార్తెను పెళ్లాడదామనుకున్నాడు గాని ఆమెకు కాస్తా మతిపోయింది. ఈలోపుగా రాజకుమారుడు అక్మార్ తన ప్రియురాలిని వెతుకుతూ బయలుదేరి, రూమ్‌నగరం చేరుకున్నాడు. పరదేశీలను రాజుగారు ప్రశ్నించినాకనే వారు నగరంలో ప్రవేశించాలని నియమం ఉండటంచేత అక్మార్‌ను రాజభటులు ఆ రాత్రి ఖైదులో ఉంచారు. అక్కడ సిద్ధుడికీ అక్మార్‌కూ సంభాషణ జరిగింది. సిద్ధుడని అక్మార్‌కు తెలుసును గాని, అక్మార్ అని సిద్ధుడికి తెలియదు.]

మర్నాడు తెల్లవారి రాజభటులు అక్మార్‌ను ఖైదునుంచి విడిపించి, తీసుకుపోయి సుల్తాను ఎదట హాజరుపెట్టారు. అతను పరదేశీ అనీ, కిందటి సాయంకాలం పొద్దుపోయి నగరానికి రావటంవల్ల సుల్తానుగారి ఎదటికి తీసుకువచ్చే అవకాశం లేకపోయిందనీ వారు చెప్పారు.

"మీది ఏ దేశం? నీ పేరేమిటి? మా రాజ్యానికి ఏం పనిమీద వచ్చావు?" అని సుల్తాను అక్మార్‌ను అడిగాడు.

ఆర్. దయానందరావు




చేశావంటే నీవేది కోరితే అది తడువుకో కుండా ఇస్తాను," అన్నాడు.

"అల్లా దయవల్ల ఏలినవారు చల్లగా ఉండాలి! ఆ అమ్మాయికి మతి ఎలాటి పరిస్థితులలో చెడిపోయిందో కాస్త వివరించి చెబుతారా ?" అని అక్మార్ అడిగాడు.

సుల్తాను జరిగిన కథ అంతా చెప్పి, "ఆ ముసలివాణ్ణి చితక కొట్టించి చీకటికొట్టులో వేయించాను," అన్నాడు.

"కొయ్యగుర్రం ఏమయింది ?" అని అక్మార్ అడిగాడు.

"దాన్ని నా సేవకులు భద్రంగా కాపాడుతున్నారు," అన్నాడు సుల్తాను.

"నాపేరు హర్జా. మాది పర్షియాదేశం. నేను మానసిక వ్యాధులు చికిత్స చేస్తూ దేశసంచారం చేస్తున్నాను. పెద్దపెద్ద తల పాగాలు చుట్టి, పంచాంగాలు చూసి వైద్యం చేసే పద్ధతి నాకు సరిపడదు. నేను మంత్రాలు జపించను," అని అక్మార్ జవాబు చెప్పాడు.

ఈమాట విని సుల్తాను పరమానందం చెంది, "నీపంటి వైద్యుడే నాకిప్పుడు అవసరంగా కావాలి. నేను ఒక అందగత్తెను పెళ్లాడదామనుకుంటూ ఉండగా ఆమెను పిశాచాలు ఆవహించి మతి పోగొట్టాయి. ఆ పిల్లకు చికిత్స చేసి మామూలు మనిషిని

ఆ గుర్రాన్ని ఒకసారి మళ్లీ చూసి దాని మీటలు సరిగా పని చేస్తున్నదీ లేనిదీ తెలుసుకోవాలని అక్మార్‌కు కోరిక కలిగింది. గుర్రం చెడిపోకుండా ఉంటే తన కార్యక్రమం ఒక విధంగా ఉంటుంది; అది చెడిపోయి ఉంటే మరొక విధంగా ఉంటుంది. అందుచేత అతను సుల్తానుతో, "అయ్యా, ఆ గుర్రాన్ని నేను ఒక్కసారి చూడాలి. ఎందుచేతనంటే ఈ కన్యకు మతిపోవటానికీ ఆ గుర్రానికీ ఏదైనా సంబంధం ఉండవచ్చు!" అన్నాడు.

"దానికేం ముభ్యంతరం?" అంటూ సుల్తాను అక్మార్‌ను తనవెంట గుర్రం ఉన్న

చోటికి తీసుకుపోయాడు. అక్మార్ గుర్రాన్ని పరీక్షించి మీటలన్నీ సరిగానే ఉన్నట్టు తెలుసుకున్నాడు.

"అల్లా ఏలినవారిని చల్లగా చూడాలి! ఇప్పుడు మనం రోగిని చూద్దాం! ఆమెకు పట్టుకున్న మనోవ్యాధిని కుదర్చగలనన్న ధైర్యం నాకిప్పుడు కలిగింది!" అన్నాడతను సుల్తానుతో.

ఇద్దరూ కలిసి రాజకుమార్తె నహర్ ఉన్న గదికి వెళ్ళారు. ఆమె చేతులు తిప్పుతున్నది, గుండె బాదుకుంటున్నది, బట్టలు చించి పోగులు పెడుతున్నది. అక్మార్ ఆమెను చూస్తూనే అదంతా నటన అనీ, ఆమెకు ఏ దయ్యమూ పట్టలేదనీ, మతి పోలేదనీ తెలుసుకున్నాడు. అతను ఆమెను సమీపిస్తూ, "త్రిభువనసుందరీ, నీకు మన శ్శాంతి కలుగుగాక!" అన్నాడు.

ఈ మాటలు వింటూనే రాజకుమార్తె తన ప్రియుడికేసి చూసి గుర్తించింది. ఆమె ఆనందపారవశ్యంలో కెవ్వున అరిచి మూర్ఛపోయింది. వైద్యుణ్ణి చూడగానే దయ్యం పారిపోయిందనుకున్నాడు సుల్తాను. అయనను గది వాకిలివద్ద ఆగమని చెప్పి అక్మార్ రాజకుమార్తెవద్దకు వెళ్ళి ఉపచారాలు చేసి మూర్ఛ తేర్చాడు. తరవాత అతను రహస్యంగా ఆమెతో, "ఇంకా కొంచెం ఓపిక





పట్టావంటే మనమీ సుల్తాను చెరనుండి బయట పడతాం. నీకు దయ్యం పట్టిందని సుల్తానుతో చెబుతాను," అన్నాడు.

రాజకుమార్తె నహర్‌కూడా రహస్యంగా, "సరే!" అన్నది.

అక్మార్ సుల్తాను నిలబడి ఉన్న చోటికి తిరిగి వచ్చి, "ఈమెకు దయ్యం పట్టింది. దాన్ని నేను వదిలించాను. ఇప్పుడు మీరు వెళ్ళి మంచిగా పలకరించండి. మీరు ఆమెకు ఏమేమి వాగ్దానాలు చేద్దామనుకున్నారో అవన్నీ చేసెయ్యండి. అంతా మీకు అనుకూలంగా జరుగుతుంది, భయంలేదు!" అన్నాడు.

అత్యాశ్చర్యం చెందుతూ సుల్తాన్ రాజకుమార్తె నహర్‌ను సమీపించాడు. ఆయన రావటం చూసి ఆమె లేచి నిలబడి సలాం చేసి, "నన్ను చూడవచ్చారా? ధన్యురాలిని!" అన్నది.

ఈ మాటలు విని సుల్తాను ఆనందోత్సాహంతో మూర్ఛపోయినంత పని చేశాడు. ఆయన అక్కడ ఉన్న బానిసలనూ, కొజ్జాలనూ పిలిచి, "మీరు ఈమెను కనిపెట్టుకుని ఉండండి. ఈమెను స్నానశాలకు తీసుకుపోయి చక్కగా స్నానం చేయించి, మంచి బట్టలు కట్టించి, నగలతో అలంకరించండి," అన్నాడు. వారు సుల్తాను చెప్పిన ప్రకారమే ఆమెచేత స్నానం చేయించి ఆమెకు రాజవస్త్రాలు కట్టబెట్టి, మెడలో రత్నహారం వేశారు. ఆమె పున్నమిచంద్రుడులాగా ప్రకాశిస్తూ సుల్తానువద్దకు వచ్చింది.

సుల్తాను అక్మార్ వంక తిరిగి, "నాకు ఇంత సుఖం సమకూర్చిన నీవు మామూలు వైద్యుడవు కావు. నీ రుణం ఎలా తీర్చుకోవాలి! అల్లా నీకు అష్టఐశ్వర్యాలూ చేకూర్చాలి!" అన్నాడు.

"మహాప్రభూ, చికిత్స ఇంకా కొద్దిగా దిగబడి ఉన్నది. తమ సెలవైతే దాన్ని ముగిస్తాను. ఆ గుర్రం ఉన్నది చూశారా,

అందులోనే దయ్యం కిటుకు ఉన్నది ; నేను ఆ సంగతి ముందే అనుమానించాను. ఆ దయ్యాన్ని మారణహోమం చెయ్యగలందులకు మనం ఈ గుర్రం దొరికిన చోటికి గుర్రంతో ఈమెతోసహా వెళ్ళాలి. ఈ గుర్రంలో ఉన్న దయ్యాన్ని మారణహోమం చేయని పక్షంలో నెలనెలా అది ఈమెను పీడిస్తూనే ఉంటుంది. ప్రతిసారీ దాన్ని నేను పారదోలుతూ ఉండాలి. అలాటి చిక్కు లేకుండా నేను చేస్తాను," అన్నాడు అక్మార్.

సుల్తాను ఇందుకు సమ్మతించాడు. సుల్తానూ, ఆయన పరివారమూ, అక్మార్, నహర్ నగరం వెలపల ఉండే మైదానానికి గుర్రంతోసహా బయలుదేరి వెళ్ళారు. రాజకుమారుడు కొయ్యగుర్రాన్ని ఒకచోట ఉంచి దానిపై రాజకుమార్తెను ఎక్కించాడు. సుల్తానునూ పరివారాన్నీ దూరంగా ఉండమని అతను సుల్తానుతో, "మహాప్రభూ, ఈ గుర్రంలో ఉండే భూతాన్ని మీకు ప్రత్యక్షంగా చూపుతాను. నేను ఆ గుర్రంపైకి ఎక్కి మంత్రాలు చదవగానే ప్రాణం లేని ఈ గుర్రం కదిలి అడుగులు వేసుకుంటూ మీదగ్గిరికి వస్తుంది. తరవాత మీరు ఆ కన్యను గుర్రంపైనుంచి దింపి పెళ్లాడేసుకో వచ్చు," అన్నాడు.



సుల్తాను ఆశ్చర్యానికి ఉత్సాహంకూడా జత అయింది. ఇదంతా ఎలా జరుగుతుందో చూడాలని ఆయన ఉబలాటపడ్డాడు. అక్మార్ సుల్తానుదగ్గిరనుంచి గుర్రంవద్దకు నడిచివెళ్లి, దాని పైకెక్కి మీట నొక్కాడు. గుర్రం గాలిలోకి లేచి అంతరిక్షంలోకి సూటిగా వెళ్లి అంతర్ధానమైపోయింది.

కాని అంతటితో తన ఆట కట్టిందని సుల్తానుకు అర్థంకాక ఆయన ఆ పూట అంతా ఆ మైదానంలోనే ఉండి గుర్రం తిరిగిరావటంకోసం ఎదురుచూశాడు. తరవాత ఆయన తన భవనానికి తిరిగిపోయి ఇంకా గుర్రం రాకకోసం ఎదురుచూస్తూనే

ఉన్నాడు. తన ఆశ నిరాశ అని తెలిసి పోయాక ఆయన చీకటికొట్టులో ఉన్న ముసలి సిద్ధుణ్ణి తన ఎదటికి రప్పించి, "ఓరీ, అధముడా! ఆ గుర్రంలో దయ్యం ఉన్న సంగతి ఎందుకు చెప్పావుకావు? ఆ పిల్లకు చికిత్సచేసిన వైద్యుణ్ణీ, ఆ పిల్లనూ కూడా దయ్యం తీసుకుని ఆకాశంలోకి వెళ్ళి పోయింది. పాపం, వాళ్ళేమవుతారో! అదీ గాక ఆ పిల్లకు నేను బోలెడన్ని నగలు పెట్టాను. అవన్నీ పోయాయి. అందుచేత నీ తల తీయించేస్తాను," అన్నాడు.

ఆయన చెయ్యి ఊపగానే భటుడొకడు కత్తి ఎత్తి సిద్ధుడి తల తెగవేశాడు.

ఈలోపల రాజకుమారుడు అక్మార్ తన ప్రియురాలితో సహా క్షేమంగా తన ఊరు చేరుకున్నాడు. అతను ఈసారి వనంలో విడిది చేసే ప్రమేయం పెట్టుకోక, గుర్రాన్ని నేరుగా తమ భవనంపైన గల మిద్దెమీద దించాడు. అతను కిందికి దిగి వెళ్ళేసరికి అతని తలిదండ్రులూ, ముగ్గురు చెల్లెళ్లూ ఎంతో విచారంగా కూచుని ఉన్నారు. అతన్ని చూడగానే వారికి ప్రాణాలు లేచివచ్చి నట్టయింది.

రాజకుమారుడు అక్మార్‌కూ, సనా రాజకుమార్తె నహార్‌కూ వైభవంగా వివాహం జరిగింది. ఊరేగింపులూ, ఉత్సవాలూ, విందులూ, వినోదాలూ ఒక నెలపాటు సాగాయి. అక్మార్ జరిగిన కథ యావత్తూ ఉత్తరం రాసి ఒక దూతద్వారా తన మామగారికి అందజేస్తూ ఆయనకు, అంతులేని కట్నకానుకలుకూడా పంపాడు.

సాబూర్ చక్రవర్తి కీలుగుర్రాన్ని విరగగొట్టించి, దాని యంత్రాలన్నిటినీ నాశనం చేయించాడు; అప్పటికిగాని ఆయన మనస్సు స్థిమితపడలేదు. తన మామగారూ, తండ్రీ పోయిన అనంతరం అక్మార్ రెండు దేశాలకూ రాజై సుఖంగా రాజ్యపాలన చేశాడు.

—(అయిపోయింది)

